# జాతీయ పతాకం-గీతం

రావినూతల శ్రీరాములు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

JATEEYA PATAAKAM–GEETAM By *Ravinootala Sreeramulu*

ప్రచురణ నెం. : 2350/2224 R

ప్రతులు : 1000

మొదటి ముద్రణ : మార్చి, 1988

తొమ్మిదవ ముద్రణ : సెప్టెంబర్, 2003

పదవ ముద్రణ : జనవరి, 2005



1 This book was selected by the Director of School Education, A.P. Hyderabad, to Purchase to the Primary School Libraries in our State under "OPERATION BLACK BOARD SCHEME"

2. వయోజన విద్యా డైరెక్టరు వారి నెం. 13275/B1/DAE dated 29-10-87 లో అనుమతింపబడినది.

**వెల: రూ.12-00**

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాద్-500 001.
E-mail: visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్, సుల్తాన్‌బజార్) హైదరాబాద్,
విజయవాడ, విశాఖపట్నం, గుంటూరు,
తిరుపతి, హన్మకొండ, అనంతపురం, కాకినాడ.



ముద్రణ: **శ్రీకళాంజలి గ్రాఫిక్స్,** నారాయణగూడ, హైదరాబాద్.

# జాతి అంటే

జాతి అంటే ఫలానా అని చెప్పడం కష్టం.

ఒకే రక్తం కలిగిన వాండ్లందరూ ఒక జాతి అందాం అంటే ఏ గుంపు వాండ్లకూ ఒకే రకమైన రక్తం వుండదు.

ఒక మతం వాళ్ళంతా ఒక జాతి అనటానికి వీల్లేదు. ఒక పరిమిత భూభాగంలో వుండేవారినే ఒక జాతిగా గుర్తిస్తాం.

మతం అట్లా కాదే మరి? అది అనేక దేశాలలో వ్యాపించి వుండవచ్చు కదా?

భాషను బట్టి కూడా జాతి నిర్ణయం కుదరడం లేదు.

ఇంగ్లాండు ప్రజలు, అమెరికా ప్రజలు మాట్లాడే భాష ఒక్కటే-అదే ఇంగ్లీషు.

ఇంగ్లీషు, అమెరికా దేశాల వారు వేరు వేరు జాతులకిందనే

ఒకేచోట నివసిస్తూ ఒకే రకమైన కష్టసుఖాలు అనుభవిస్తూ వుండేవాండ్లకు "మనమంతా ఒక్కటే" అనే భావం ఏర్పడుతుంది. అది చాలా సహజంగా కూడా వుంటుంది.

దీనినే "జాతీయత" అంటారు. భారతీయులందరూ ఒకే జాతి.

వీరికి కొన్ని తేడాలుండొచ్చుకాని, పై దేశాలకు పోయినప్పుడు వీళ్ళంతా ఒకటిగా వుంటారు.

భారతీయ క్రైస్తవుడు ఏ దేశం వెళ్ళినా భారతీయుడే అవుతున్నాడు.

అలాగే భారతీయ ముస్లింలు టర్కీ, అరేబియా, ఇరాక్ వెళ్ళినా భారతీయుడే అంటారు.

ఏదో ఒక రాజ్యానికి చెంది వుండడాన్ని జాతీయత అంటారు. రాజ్యంలోవున్న వారందరినీ ఆ దేశపు జాతీయులు అంటారు.

జాతీయ భావంలోనే దేశాన్ని ప్రేమించడం యిమిడి వుంది. దేశభక్తి అంటే అదే.

జాతిని శక్తి కలదానిని చేయటంలోనూ, వ్యక్తి దేశానికి విధేయుడుగా వుండటంలోనూ, ఇది తోడ్పడుతుంది.

నెహ్రూ పండితుడు ఏమన్నాడంటే, "జాతీయభావం చాలా లోతైనదీ, బలమైనదీ, అది గతకాలం నాటికి చెందినదై రానున్న కాలానికి పనికిరాకపోయేది కాదు."

జాతీయత ప్రజలలో ఆత్మ విశ్వాసాన్ని ఆత్మగౌరవాన్ని కల్గిస్తుంది.



# జెండా జాతికి జీవగఱ్ఱ

అనాది నుండీ ప్రతి జాతికీ ఒక జెండా వుంది.

అర్జునుడి జెండా మీద కోతి బొమ్మ ఉండేది.

రాణాప్రతాపుడి జెండా మీదా, శాతవాహనుల జెండా మీదా "సింహం" గుర్తు వుండేది.

శివాజీ జెండా కాషాయ రంగుది. దాని మీద భవాని అమ్మవారి చిత్రం వుండేది.

మన కాలంలో బ్రిటిష్ వాండ్ల జెండా "యూనియన్ జాక్".

చారలూ, నక్షత్రం వున్న జెండా అమెరికా వాండ్లది.

ఎర్ర రంగు జెండా మీద సుత్తి, కొడవలి వున్న పతాకం రష్యా దేశానిది.

ప్రతి దేశం తన గత వైభవాలకు గుర్తుగా, ఆశయాలు ఆదర్శాలకు అద్దంగా జాతీయ పతాకాలను ఏర్పరచుకొంటుంది.

అందుకే "పతాక మన ఆదర్శానికి ప్రతీక" అన్నారు గాంధీజీ.

నడి సముద్రం ఏ ఒక్క దేశం సొత్తూ కాదు. అక్కడ ప్రయాణం చేసే ఓడలపైన ఏ దేశం జెండా వుంటే ఆ ప్రాంతం మీద అధికారం ఆ దేశానిది.

అందుకే అలాంటి ఓడలను "ప్రయాణించే ద్వీపాలని" కూడా అంటారు.

యుద్ధ సమయంలో పతాకం చేతిలోవున్న వీరుడు పడిపోతుంటే మరి ఒక వీరుడు అందుకొని పతాకం పడిపోకుండ చూస్తాడు.

*"ఝండా ఊంఛా రహే హమారా"*

# మూడు రంగుల జెండా

మన దేశంలో మొదటిసారిగా జాతీయ పతాకాన్ని కలకత్తాలోని గ్రీన్‌పార్కులో 1906 ఆగష్టు 7వ తేదీన ఎగురవేశారు. దీనిలో ఎరుపు, పసుపు, ఆకుపచ్చ రంగుల అడ్డచారలు వున్నాయి.

ఎరుపు చారమీద 8 తెల్లని పద్మాలు, పసుపు చారలమీద "వందేమాతరం" అని దేవనాగర లిపిలో అక్షరాలు వున్నాయి.

ఆకుపచ్చ చారమీద సూర్యుడు, నెలవంక, చుక్క వున్నాయి. మదాం కామా, ఆమె స్నేహితులు కొందరు విప్లవకారులు పారిస్ నగరంలో 1907 సం॥లో ఒక పతాకాన్ని ఎగురవేశారు. ఇదీ పైన చెప్పిన పతాకం మాదిరే వుంది. ఏవో కొద్ది కొద్ది మార్పులు తప్ప.

1917 సం॥లో మరి ఒక పతాకం రూపొందించారు. దీనిలో ఏడు నక్షత్రాలు వున్నాయి.

1921 నుండి కాంగ్రెస్ సంస్థ గాంధీజీ నాయకత్వం కిందికి వచ్చింది.

ఆ సంవత్సరంలోనే విజయవాడలో కాంగ్రెస్ సంఘం సమావేశమైనది.

తెలుగు యువకుడు పింగళి వెంకయ్యగారు ఆ సభలో పాల్గొన్నారు. ఆయన పతాకాలను గూర్చి బాగా పరిశోధన చేసినారు.

1916 లోనే "భారతదేశానికి ఒక జాతీయ పతాకం" అనే పుస్తకం కూడా రాశారు. లక్నోలో జరిగిన కాంగ్రెస్ సభలో వెంకయ్య తయారుచేసిన జాతీయ పతాకం హోం రూల్ పతాకసంఘం ఎగరవేసింది.

1921 మార్చిలో కాంగ్రెస్ సమావేశం విజయవాడలో జరిగింది. వెంకయ్యగారు తాము తయారుచేసిన పతాకం నమూనా గాంధీజీకి చూపారు.

దేశంలో ఉన్న రెండు ప్రధాన వర్గాలకూ ఎరుపు, ఆకుపచ్చ చారలు గుర్తులుంచి, ఇతర వర్గాలకు గుర్తు తెల్లని చార.

ఈ విధంగా మూడు రంగులతో పతాకం రూపొందించారు వెంకయ్యగారు.

ఈ నమూనా గాంధీజీకి బాగా నచ్చింది. తెల్లచార మీద చరఖా చేర్చమన్నారు గాంధీజీ.

ఈ విధంగా మూడు రంగుల జెండా తయారుచేసిన కీర్తి తెలుగు వారిదే.

తరువాత చాలాకాలానికి 1931 లో అఖిలభారత కాంగ్రెస్ సంఘం ఈ పతాకాన్ని ఆమోదించింది. అయినా గాంధీజీ ఆమోదం పొందినందువల్ల అంతకుముందు ప్రతి కాంగ్రెస్ సమావేశంలో మూడు రంగుల జెండాలే ఎగరవేసేవారు.

కుంకుమ రంగు ధైర్యానికీ, త్యాగానికీ: తెలుపు శాంతి సత్యాలకూ; ఆకుపచ్చ విశ్వాసం, ఔదార్యానికి గుర్తు.

జాతీయ పతాకానికి పునాది అయిన మూడు రంగుల పతాకాన్ని రూపొందించిన పింగళి వెంకయ్యగారిని దేశ ప్రజలందరూ చిరకాలం గుర్తుంచుకుంటారు.

గాంధీజీ యంగ్ ఇండియా పత్రికలో ఇలా రాశారు. "మచిలీపట్నంలోని ఆంధ్ర జాతీయ కళాశాలకు చెందిన పింగళి వెంకయ్య ఇతరదేశ పతాకాలను గురించి వివరాలతోపాటు భారత జాతీయ పతాకం ఉండడానికి నమూనాలను సూచిస్తూ ఒక చిన్న పుస్తకాన్ని ప్రచురించి కొన్ని యేండ్ల నుండి ప్రచారం సాగించినారు. గడచిన నాలుగు సంవత్సరాల నుంచీ ప్రతి కాంగ్రెస్ సభలో పట్టుదలగా జాతీయ జెండాను గురించి ఆయన చేసిన కృషిని నేను శ్లాఘించక తప్పదు."

త్రివర్ణ పతాకాన్ని రూపకల్పన చేసింది వెంకయ్య కాగా జలంధర్‌కు చెందిన హంసరాజ్ అనే ఆయన రాట్నం వుండదగినదని గాంధీజీకి సూచించారు.

❀ ❀ ❀

# పింగళి వెంకయ్య

మూడు రంగుల జెండాకు రూపకల్పన చేసిన శ్రీ పింగళి వెంకయ్య 1876 ఆగష్టు 2 న కృష్ణాజిల్లాలో జన్మించాడు.

ఆయన తండ్రి హనుమంతరాయుడు. తల్లి వెంకటరత్నమ్మ.

చల్లపల్లి జమీందారిలోని పెదకళ్ళేపల్లిలో ప్రాథమిక విద్య పూర్తిచేసి, వెంకయ్య 1888 లో మచిలీపట్నం చేరాడు.

అక్కడి హిందూ హైస్కూలులో చదివి మెట్రికుయ్యలేషన్ పరీక్ష పాసయినాడు.



19వ ఏట దక్షిణాఫ్రికా వెళ్ళి బోయెరు యుద్ధంలో పనిచేశాడు. అక్కడ గాంధీజీతో పరిచయం కలిగింది.

మన దేశానికి తిరిగివస్తూ అరేబియా, పర్షియా దేశాలలో కొంతకాలం గడిపాడు.

1904వ సం॥లో బళ్ళారిలో ప్లేగు ఇన్‌స్పెక్టరుగా పనిచేశాడు. మరలా చదువుమీద ధ్యాస కలిగి శ్రీలంక వెళ్ళాడు.

కొలంబో కాలేజీలో చదివి కేంబ్రిడ్జి సీనియర్ పరీక్షలో విజయం సాధించాడు. మన దేశం వచ్చి బెంగుళూరు, మద్రాసు మార్గంలో రైల్వే గార్డుగా కొంత కాలం పనిచేశాడు.

మరలా చదువుకోవాలనిపించి వెంకయ్య లాహోరు వెళ్ళాడు. ఆంగ్లోవేదిక్ కళాశాలలో చేరి ఉర్దూ, జపాన్ భాషలు బాగుగా నేర్చాడు. జపాన్ భాషలో ఉపన్యాసాలు చక్కగా యిచ్చేవాడు. అందరూ అతన్ని "జపాన్ వెంకయ్య" అని పిలిచేవారు.

1906 లో కలకత్తాలో దాదాభాయి నౌరోజీ అధ్యక్షతన కాంగ్రెస్ మహాసభ జరిగినది.

ఆ సభకు వెంకయ్య హాజరై విషయ నిర్ణయ సభా సభ్యుడైనాడు.

వెంకయ్య ఆ సభలోనే మునగాల రాజాను కలిశాడు. రాజావారు వెంకయ్యను తన ఎస్టేటుకు కొనిపోయారు.

1907 నుండి 1910 వరకు మునగాలలో వెంకయ్య వ్యవసాయ పరిశోధనలు చేశాడు. కంబోడియా ప్రత్తి ఆయన పరిశోధనల వల్ల ప్రచారంలోనికి వచ్చినదే!

అప్పటిలో ఆయనను "ప్రత్తి వెంకయ్య" అని పిలిచేవారు.

1911 నుండి 1919 వరకు వెంకయ్య మచిలీపట్నం జాతీయ కళాశాలలో పనిచేశాడు. చరిత్ర, వ్యవసాయం బోధించేవాడు.

చైనాలో విప్లవం నడిపిన సన్‌యెట్ సేన్ జీవిత చరిత్ర అప్పుడే వెంకయ్య రాశాడు.

1914 లో మచిలీపట్నంలో తన వ్యవసాయ క్షేత్రానికి "స్వేచ్ఛాపురం" అని వెంకయ్య పేరు పెట్టాడు. కొంత కాలానికి వెంకయ్య చెన్నపురి కళాశాలలో చేరి భూగర్భశాస్త్రము చదివాడు.

1924 నుండి 1944 వరకూ ఆంధ్ర దేశంలో శ్రీ వెంకయ్య భూగర్భ పరిశోధనలు చేశాడు.

అనేక విధాలుగా దేశానికి సేవచేసిన వెంకయ్య చివరి దినాలు దారిద్ర్యంలో గడిచినవి.

1963 జులై 4 వ తేదిన ఆయన కాలధర్మం చెందాడు.

❀ ❀ ❀

# శ్రీమతి కామా

1907 లో విదేశాలలో మన పతాకాన్ని ఎగరవేసిన మదాం కామాను గూర్చి కొంచెం తెలుసుకొందాం.



ఈమె పూర్తి పేరు బికాయిజీ రుస్తుం కామా. ఈమె 1861 సెప్టెంబరు 24 న జన్మించింది. వీరిది జురాష్ట్రియన్ మతం. ఈమె తండ్రి సొరాబ్జీ ఫ్రాంజ్ పటేల్, తల్లి జిజీ. వీరికి ఏకైక పుత్రిక కామా. భర్త రుస్తుం కామా. "బొంబాయి క్రానికల్" పత్రికను నడిపేవాడు. 1885లో వీరి వివాహం జరిగింది. మహారాష్ట్రలో కరవు నివారణ కృషితో ఈమె సంఘసేవ ప్రారంభమైనది.

ఆరోగ్యం దెబ్బతిన్న కారణంగా 1902 లో ముందుగా ఇంగ్లాండు వెళ్ళింది. 1905 లో లండన్‌లో దాదాభాయి నౌరోజీ ఆంతరంగిక కార్యదర్శిగా పనిచేసింది. ఒకరోజు లండన్ పార్కులో బ్రిటిష్ విధానాలను తీవ్రంగా ఖండిస్తూ ఉద్రేక పూర్వక ప్రసంగం చేసింది. తక్షణమే ఈమెను ఆ దేశం నుండి బహిష్కరించారు.

ఫ్రాన్సుచేరి విప్లవకారులతో పరిచయం పెంచుకొన్నది. వీర సావర్కర్, వి.వి.ఎస్ అయ్యరులకు పలువిధాల తోడ్పడింది.

సావర్కార్ గ్రంథం "మొదటి స్వాతంత్ర్య సంగ్రామం" వీరి వలననే ప్రచారం పొందినది.

వందేమాతరం పత్రికను కొంతకాలం నడిపింది. 1908 లో ఆగస్టులో జర్మనీలోని 'ఫ్రంట్ గార్డు'లో అంతర్జాతీయ సోషలిస్టు మహాసభ జరిగింది. బ్రిటిష్ ప్రతినిధి రామ్‌సేమాగ్డొనాల్డు ప్రతిఘటించినా ఇంగ్లాండు దేశానికి చెందిన మారిస్ హిండ్‌మాన్, ఫ్రాన్సు దేశానికి చెందిన జీన్‌జయిర్సు తనను బలపరుస్తూ వుండగా మదాం కామా భారతదేశ స్వాతంత్ర్య తీర్మానం ప్రతిపాదించింది. అంతేకాదు భారత పతాకాన్ని ఎగరవేస్తూ ఇలా చెప్పింది. "ఈ జెండా భారత స్వాతంత్ర్యానికి చిహ్నం దర్శించండి. అది ఆవిర్భవించింది అమరులైన భారత యువకుల రక్తంతో అది ముందుగానే పావనమైనది. పెద్దలందరినీ నిలబడి ఈ భారత స్వాతంత్ర్య పతాకానికి వందనం చేయవలసిందిగా నేను కోరుతున్నాను. ప్రపంచంలో ఐదవ వంతుగల భారత భూమికి స్వేచ్ఛ లభించటానికి ఈ జెండాతో సహకరించవలసిందిగా ప్రపంచంలోని స్వేచ్ఛా ప్రియులను నేను కోరుతున్నాను."

రష్యా నాయకుడు లెనిన్ కొన్ని దినాలు ఈమె నివాసంలో గడిపాడు.

బ్రిటిష్ ప్రభుత్వం ఈమెను పట్టి ఇవ్వమని కోరగా ఫ్రెంచి ప్రభుత్వం నిరాకరించింది. గట్టి భద్రతా ఏర్పాట్లు చేసింది.

కానీ ఫ్రెంచి ప్రభుత్వమే మొదటి ప్రపంచ యుద్ధకాలంలో అరెస్టు చేసింది.

1935 లో భారతదేశాన్ని సందర్శించిన శ్రీమతి కామా తీవ్రంగా జబ్బుపడినది.

1936 ఆగస్టు 18న అంతిమ శ్వాస విడిచింది.

వీర వనిత శ్రీమతి కామా భారత స్త్రీలకు గర్వకారణం.



# జెండా పోరాటాలు

మన ఆశయాలకూ, ఆదర్శాలకూ చిహ్నం మన జాతీయ జెండా. దీనిని చిన్నబుచ్చాలని పరాయి ప్రభుత్వం చాలాసార్లు ప్రయత్నం చేసింది.

కానీ వారి ప్రయత్నాలను ఉత్సాహంగల యువకులు ఎదిరించారు. ఈ పోరాటంలో కొందరు బలి అయినారుకూడా.

1923 లో నాగపూర్‌లో జెండా సత్యాగ్రహం జరిగినది. దేశం అన్నిచోట్ల నుండి యువకులు అక్కడికి వెళ్ళి జెండా గౌరవం కాపాడారు.

నాగపూర్‌లో జాతీయ పతాక ఉత్సవం జరుగుతూ వుంది. ఊరేగింపు పెద్ద బజారులోనికి పోకూడదని నిషేధించారు. తమకు తమ ఇష్టంవచ్చిన చోటికి పతాకాన్ని తీసుకుపోయేహక్కు వుందని వలంటీర్లు వాదించారు. అప్పుడు వలంటీర్లను అరెస్టు చేశారు. అది ఒక ఉద్యమంగా మారింది.

జమన్‌లాల్ బజాజ్, పటేల్ సోదరులు దీనిని విజయవంతం చేశారు.

ఆనందంతో లాఠీ దెబ్బలు, జైలుశిక్షలు అనుభవించారు.

1947 ఆగస్టు 7న స్వామీ రామానందతీర్థ హైదరాబాదులోని సుల్తాన్‌బజారులో త్రివర్ణ పతాకం ఎగరవేశారు. ఆ పతాకాన్ని ప్రధాని నెహ్రూ స్వయంగా స్వామీజీకి ఇచ్చారు.

వేలకు వేలు ఆ సన్నివేశం చూచి ఆనందించారు. నిజాం ప్రభుత్వం స్వామితోపాటు అనేకమందిని నిర్బంధించింది. ఒక పత్రికలో స్వామీజీ ఇలా రాశారు. “తుపాకి గుండు నా గుండెలో దూరి నేను ప్రాణం వదిలే సమయంలో కూడ స్వాతంత్ర్య పతాకాన్ని పట్టుకునే ఉంటాను.”

బందర్‌లో తోట నరసయ్య అనే కుర్రవాడు మూడు రంగుల జెండా ఎగరవేయడానికి స్తంభం ఎక్కుతూవుంటే పోలీసులు ఎముకలు విరిగేటట్లు లాఠీలతో కొట్టారు. కానీ పట్టుదలతో జెండా ఎగరవేసిన తరువాతనే స్తంభం దిగాడు. దెబ్బలకు సొమ్మసిల్లి పోయాడు. ఆయనను "జెండా వీరుడు నరసయ్య" అని పిలిచేవారు.

వరంగల్లులో మొగిలియ్య అనే యువకుడు ఎగురుతున్న జెండాను దించివేయడానికి ఒప్పుకోలేదు. నిజాం పాలకులు అతనిని ముక్కలు ముక్కలుగ చేసి చంపారు.

ఉత్తరప్రదేశ్‌లో జెండా ఎగరవేయకుండా పోలీసులు కట్టుదిట్టం చేశారు. చుట్టూ కాపలాఉన్న పోలీసు వలయం కన్నుగప్పి ఆడవేషంలో ఒక వ్యక్తి అనుకున్న సమయానికి వచ్చి జెండా కట్టి చక్కాపోయాడు. ఆ వ్యక్తి ఎవరోకాదు పూర్వం మన దేశ ప్రధాని అయిన లాల్ బహదూర్ శాస్త్రి.



# జనవరి 26 ప్రాముఖ్యం

1929 లో లాహోరులో కాంగ్రెసు మహాసభ జరిగింది. నాటి కాంగ్రెసు అధ్యక్షులు జవహర్‌లాల్ నెహ్రూ.

డిశంబరు 31 వ తేది అర్ధరాత్రి 'రావి' నది ఒడ్డున మూడు రంగుల జెండా ఎగరవేశారు. పిమ్మట కాంగ్రెసు అధ్యక్షులైన నెహ్రూ మాటలాడుతూ "ఈ క్షణం నుండి కాంగ్రెసు లక్ష్యం సంపూర్ణ స్వరాజ్య సాధనే" అని అన్నారు.

తరువాత కాంగ్రెసు కార్యవర్గం జనవరి 26వ తేదీ స్వాతంత్ర్యదినంగా జరపాలని కోరింది. ఫలితంగా 1930 జనవరి 26న దేశమంతటా సభలు జరిపి ప్రమాణాలు చేశారు. ఆ ప్రమాణంలో ముఖ్యమైన భాగం ఇలా ఉంది.

"మిగిలిన దేశాల ప్రజల మాదిరిగానే స్వాతంత్ర్యం పొందటానికీ, తమ కష్టం ఫలితాలు అనుభవించడానికీ భారతదేశ ప్రజలకు హక్కు ఉంది. అందువల్ల భారతదేశం బ్రిటన్‌తో సంబంధాలను తెగతెంపులు చేసికొని పూర్తి స్వాతంత్ర్యం పొందాలని మేము భావిస్తున్నాం."

జనవరి 26కు గల ప్రాముఖ్యం వల్లనే 1950 సం॥లో రిపబ్లిక్ ఏర్పడినపుడు తిరిగి అదే తేదీనుండి రాజ్యాంగం అమలు ప్రారంభమైంది.



# ధర్మచక్రం

కాంగ్రెస్ జాతీయ సంస్థ నిలిపిన మూడు రంగుల పతాకంలో రాట్నానికి బదులు చక్రం ఏర్పరచారు.

సాధారణంగా పతాకంలో ఒక వైపున్న గుర్తు రెండో వైపు చూచినా అలాగే కన్పించాలి. "రాట్నం" గుర్తు ఉంచినట్లయితే ఇది వీలుపడదు. చక్రం అయితే రెండు వైపులా ఒకే మాదిరి కన్పిస్తుంది.

అశోకుని ధర్మపాలన ప్రపంచం అంతటా గుర్తింపు పొందింది. అందుచే ధర్మచక్రం మన జెండాలో ఉండటం సమంజసం.

మన పూర్వ రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు యిలా అన్నారు.

"చక్రం చలనానికి చిహ్నం. మన దేశం ముందుకు పోవాలి అన్న ఆశయం కూడా దీనివల్ల వెల్లడవుతుంది."

ధర్మచక్రంలో 24 ఆకులు ఉండాలని నిర్ణయించారు. ఈ సంఖ్యకు విశేష ప్రాముఖ్యం ఉంది.

రాజ్యాంగ సభలో ఈ పతాకాన్ని గూర్చి నెహ్రూ ఈవిధంగా ప్రసంగించారు.

"ఈ పతాకం యితర దేశాల మీదకు దండయాత్రలకు పోదు. ఇది స్వాతంత్ర్యానికి అసలైన గుర్తు.

ఈ జెండా ద్వారా ప్రపంచంలోని యితర దేశాలకు మనం మిత్రులుగా ఉన్నట్లు చాటుతున్నాం. బానిసలుగా ఉన్న దేశాలకు అవికూడా స్వతంత్రులు కావడానికి సహాయం చేస్తాం. ఇది మన జాతి గౌరవానికి చిహ్నం."



# రాధాకృష్ణ పండితుని వివరణ

భారత రాజ్యాంగసభవారు మన జాతీయ పతాకాన్ని ఆమోదించారు. అప్పుడు జరిగిన చర్చలలో పాల్గొన్న మహా మేధావి సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారు ఇలా అన్నారు.

"పతాకంలో మధ్యన ఉన్న తెలుపురంగు - సూర్యకిరణాలను స్ఫురింపజేస్తున్నది. శాంతి మార్గానికి, నిరాడంబర సత్యపథానికి ప్రతీకగా నిలిచి ఉన్నది. ఈ మార్గంలో వెడుతూ గమ్యం చేరడానికి అశోకుని ధర్మచక్రం నిలుపబడింది. ధర్మం లేక సత్యసంధత జడంకాదు. పురోగతిని అడ్డుకొనడంవల్లనే ఇటీవల కాలంలో మనదేశం నష్టపోయింది. జెండా పైభాగంలోని కాషాయిరంగు త్యాగానికి ప్రతీకగా నిలిచింది.

నాయకులు తమ బాధ్యతలు గుర్తెరిగి గాంధీజీవలె నిస్వార్థమైన సేవాభావానికి అంకితం కావాలని సూచిస్తున్నది.

ఈ పచ్చని నేలపైనే భూతల స్వర్గం ఏర్పడాలనే మన కృషికి నిదర్శనంగా జెండా అడుగుభాగాన ఆకుపచ్చరంగు నిలిచి ఉన్నది.

ఎల్లప్పుడు మెలకువతో ఉండు. ఎల్లవేళలా ముందుకు సాగు. క్రైస్తవ, సిక్కు, ముస్లిం, హిందూ, బౌద్ధ సోదరులందరికీ సురక్షితమైన ఆశ్రయంగా స్వేచ్ఛ సౌహార్ధం, స్వచ్ఛతతో కూడిన ప్రజాస్వామ్య వ్యవస్థ ఏర్పాటుకు కృషి చేయాలి. ఇదే స్థూలంగా మన పతాకం అందజేసిన సందేశం."



# జెండా నిబంధనలు

మనం ఎంతో పవిత్రంగా భావించే ఈ జెండాను గురించిన ముఖ్య నిబంధనలు తెలుసుకుందాం.

- పతాక వందనానికి హాజరైన వారందరూ జెండాకు ఎదురుగా సావధానులై నిలబడి వందనం చేయాలి.
- ఇతర జెండాలతో కలసి ప్రదర్శించవలసివచ్చే యెడల మన జెండాను అన్నిటికంటే కుడి భాగాన ఉంచాలి.
- ప్రముఖవ్యక్తుల మృతికి గౌరవంగా పతాకాన్ని సగానికి దించాలి.
- జెండా యెక్కడ ఎగరవేసినా స్పష్టంగా కనిపించేటట్టు ఉండాలి. దానిని అందరూ గౌరవభావంతో చూడాలి.
- ఏదో ప్రత్యేక సందర్భాలలో తప్ప సాధారణంగా సూర్యుడు ఉదయించినప్పటి నుండి అస్తమించేవరకు జెండా ఎగురుతుండాలి.
- ఉత్సవ సమయాలలో జెండా పైకి యెగరవేసేటప్పుడు వడివడిగానూ, కిందికి దించుతున్నప్పుడు నిదానముగానూ ఆ పనులు చేయాలి.
- పెనుతుఫాను వీస్తున్నప్పుడు పతాకాన్ని ఎగరవేయరాదు.

- ఊరేగింపుగా వెళుతున్నప్పుడు ముందు భాగానికి కుడివైపుగా జెండా ఉండాలి.
- జెండా పొడవు వెడల్పులు మూడు రెండు నిష్పత్తిలో ఉండాలి.
- జెండాకు ఏడు రకాల కొలతలు ఉన్నాయి. చాలా పెద్ద సైజు 6300×4200 మిల్లీ మీటర్లు. అతిచిన్న సైజు 225×150 మిల్లీ మీటర్లు.
- ఈ చిన్నసైజు - మోటారు వాహనాలమీద పెట్టుకోవడానికి వీలుగా ఉంటుంది.
- పాఠశాలలో ప్రమాణాలు తీసుకొనే సందర్భాలలో చేతులు కట్టుకొని అందరూ కలసి ప్రమాణం చేయాలి.
- జాతీయ జెండా ఉపయోగానికి పనికిరాకుండాపోతే దానిని కాల్చివేయాలి. అంతేగాని దానిని వేరే పనులకు వాడరాదు.
- జాతీయ పతాకాన్ని గౌరవించడం పౌరుల బాధ్యత. ఇలాంటి నిబంధన ఒకటి ఇటీవల మన రాజ్యాంగంలో చేర్చారు.

**2002 జనవరి 26 నుండి కింది నిబంధనలు అమలులోకి వచ్చాయి.**

కొత్త నియమావళి ప్రకారం ప్రజలు ప్రైవేటు సంస్థలు విద్యా సంస్థలు, జాతీయ పతాకాన్ని సంవత్సరం పొడవునా స్వేచ్ఛగా ఎగరవేయవచ్చు.

**కార్లమీద**

రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, గవర్నర్లు విదేశాల్లోని భారత రాయభారులు ప్రధాని కేబినెట్ మంత్రులు, ముఖ్యమంత్రులు, రాష్ట్రమంత్రులు, సుప్రీంకోర్టు, హైకోర్టు న్యాయమూర్తులు కార్లమీద పతాకాన్ని ఉంచుకొనవచ్చును.

**నిషేధాలు**

వాణిజ్యపరమైన లాభాల కోసం పతాకాన్ని వాడరాదు. దుస్తులుగా కుట్టించుకోకూడదు. వంటిపై ధరించే వస్త్రాలుగా వాడరాదు.

జాతీయ పతాకంపై ఎలాంటి రాతలు రాయరాదు. దీనిని సంచీలా వాడుకొనరాదు. సమావేశాల వేదికపై కప్ప రాదు.

**శిక్షార్హం**

జాతీయ జెండాను అవమానించినా జాతీయ గీతాన్ని అగౌరవపరచినా కనీసంగా ఏడాదిపాటు, గరిష్ఠంగా మూడేళ్ళు శిక్ష పడుతుంది.

❀ ❀ ❀

# జాతీయ గీతం

జాతీయ పతాకంలాగ జాతీయ గీతం కూడా ప్రధానమైనదే.

ముఖ్యమైన కార్యక్రమాలలో జాతీయ పతాకాన్ని ఎగరవేసిన వెంటనే జాతీయ గీతం పాడతారు.

ప్రతి దేశానికీ జాతీయ పతాకంతోపాటు జాతీయగీతం కూడా ఉంటుంది.

"భగవంతుడు రాజును రక్షించాలి." (గాడ్ సేవ్ ది కింగ్) బ్రిటిష్‌వారి జాతీయ గీతం. ఇది వినడంతోడనే ఆంగ్లేయులు ఉత్తేజితులవుతారు. ఫ్రాన్స్ దేశంలో "లామోరిస్ లెయిసీ" అనేది జాతీయ గీతం.

❀ ❀ ❀

# వందేమాతరం

జన్మభూమి స్వర్గం కంటే మిన్న అనే సుభాషితాన్ని మనం తరచూ వింటూ ఉన్నాం.

ఇక్కడ జన్మభూమి అంటే మనం పుట్టిన ఊరు కాదు. ఆసేతు హిమాచలం వ్యాపించిన భారతదేశమే ఆ జన్మభూమి. దేశంలో కొందరికి మాత్రమే కాక భారతమాత అందరికీ తల్లి. అన్ని కులాలవారు అన్ని మతాలవారు అన్ని భాషలవారు ధనికులు దరిద్రులు అందరూ ఆమె సంతానం.

జాతి అనేది పుట్టుకను తెలియజేసే మాట.

మనకు తల్లివంటిదైన భారతదేశాన్ని ఆరాధించడం మనవిధి.

పవిత్రమైన ఈ భావం మనకు కల్గించిన గేయం "వందే మాతరం."

మన జాతీయోద్యమంలో "వందేమాతరం" గేయం ప్రముఖ పాత్ర వహించింది.

హైదరాబాదు యువకుడు వావిలాల రామచంద్రరావు నైజాం రాష్ట్రంలో "వందేమాతరం" నినాదం ప్రారంభించారు.

1940 సం॥లో హైదరాబాదులోని చెంచల్‌గూడా జైలులో అయనను కిటికీకి కట్టివేశారు. ముప్పది ఆరు కొరడాదెబ్బలు కొట్టారు. ప్రతి దెబ్బకు ఆయన "వందేమాతరం" అని అనేవాడు. కొంత సేపటికి ఆయన స్పృహతప్పి పడిపోయాడు. ఆయన ఇంటిపేరు "వందేమాతరం"గా నిలిచిపోయింది.

"వందే మాతరం" పాట రాసిన కవి బంకిం చంద్ర ఛటర్జీ. 1875 లో ఆయన కలకత్తా నుండి తన సొంత ఊరికి రైల్లో పోతూ ఉన్నాడు. రైలు కిటికీ నుండి బయటకు చూస్తూ ఉన్నాడు. నదులూ, పూలు పండ్లతో నిండి అడవులూ అందంగా కన్పించాయి. అతడు భారతమాతను సందర్శించాడు.

వెంటనే భారతమాత ఎలా ఉన్నదో వర్ణిస్తూ ఆయన ఈ పాట రాశారు.

"వందేమాతరం
సుజలాం సుఫలాం
మలయజ శీతలాం
సస్యశ్యామలాం
మాతరం - వందే.....
శుభ్రజ్యోత్స్న
పులకితయామినీం
పుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం
సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం
మాతరం - వందే....

ఏనోట విన్నా అదే. ప్రజల పాట అయిపోయింది. ఈ పాటను ప్రతి కాంగ్రెస్ మహాసభలో పాడుతుండేవాడు.

1906 కాంగ్రెస్ మహాసభలో రవీంద్రనాథ్ ఠాగూర్ స్వయంగా ఈ పాట పాడారు.

బంకిం చంద్రుడు "ఆనంద మఠం" అన్న నవల రాశాడు. అంతకు పూర్వం నూరు సంవత్సరాల క్రితం బెంగాలులో జరిగిన తిరుగుబాటు ఆధారంగా అది రాశాడు.

బంకిం సాహిత్యం ఒక గొప్ప వృక్షం. "ఆనంద మఠం" దానిలో ఒక శాఖ. ఆ కొమ్మకు పూసిన పూవే "వందేమాతరం" గేయం.

బంకిం బ్రిటిష్ ప్రభుత్వంలో డిప్యూటీ మెజిస్ట్రేటు ఉద్యోగం చేశారు. ఆయన తన పాటకు యింత పేరు వస్తుందని అనుకొని ఉండడు.

బెంగాల్ విభజన సమయంలో "వందేమాతరం" మంత్రంగా పనిచేసింది. ఈ గేయాన్ని శ్రీ అరవిందులు ఇంగ్లీషులోకి అనువదించారు.

శ్రీ అరవిందులు ఇంగ్లీషులోను, లాలాలజపతిరాయ్ ఉర్దూలోను కొంతకాలం "వందేమాతరం" పత్రికను నడిపారు.

❀ ❀ ❀

# ఉద్యమంగా వందేమాతరం

బెంగాల్ రాష్ట్రం చాలా పెద్దది. దానిని రెండుగా చేయాలని తెల్ల ప్రభుత్వము తలపెట్టింది.

ప్రజలకు ఈ విభజన ఎంతమాత్రం యిష్టంలేదు.

ప్రజలు ఉద్యమం లేవదీశారు. దీనికి వందేమాతరం ఉద్యమమని పేరు వచ్చింది.

1905 అక్టోబరు 10 న ప్రభుత్వం చేసిన విభజన అమలులోకి వచ్చింది.

వందేమాతరం అంటేనే ప్రజలను అరెస్టు చేసేవారు.

1906 ఏప్రిల్ 14 వ తేదీన 'బారిసాల్'లో ఉద్యమవాదులు సమావేశం ఏర్పాటు చేసుకున్నారు.

సమావేశం అయిన పిమ్మట ప్రతినిధులు 'వందేమాతరం' నినాదాలు చేయరని హామీ యివ్వమని పోలీసులు కోరారు. అందుకు సభా నిర్వాహకులు అంగీకరించలేదు.

అందు మీద నిషేధపు ఉత్తర్వులు జారీ చేశారు. సమావేశం వాయిదా వేయబడింది. కానీ దేశం అంతటా ప్రభుత్వ చర్యకు నిరసన తెలుపుతూ సభలు జరిగాయి.

సురేంద్రనాథ్ బెనర్జీ బారిసాల్ నుండి కలకత్తా వెడుతూ ఉండగా ప్రతి రైలు స్టేషనులో ఆయనకు బ్రహ్మరథం పట్టారు. ఆయనకు మకుటంలేని మహారాజని పేరు వచ్చింది.

కలకత్తా నగరంలో వందేమాతరం సాంప్రదాయం అనే పౌర సంఘం ఏర్పడినది.

ఈ సంఘ సభ్యులు ప్రతి ఆదివారం వీధులవెంట "వందేమాతరం" ఆలాపిస్తూ తిరిగేవారు. ప్రజలు యిచ్చిన విరాళాలు తీసుకొనేవారు.

1908 జూన్‌లో బొంబాయిలో లోకమాన్యతిలక్ కేసు విచారణ సందర్భంలో వేలాదిజనం అక్కడి కోర్టుముందు గుమి గూడారు. వారంతా పెద్ద పెట్టున వందేమాతరం నినాదం చేశారు.

ఒకసారి అలహాబాదులో కొందరు యువకులు 'వందేమాతరం' నినాదాలు చేశారు. వారిని అరెస్టు చేసి జైలులో పెట్టారు. జవహర్‌లాల్ నెహ్రూకు ఈ వార్త తెలిసింది. ఆయన స్వయంగా జైలువద్దకు వెళ్ళారు. వందేమాతరం నినాదం చేశారు.

ప్రభుత్వం దిగివచ్చింది. అరెస్టయినవారిని విడుదల చేసింది.

బెంగాల్ విభజన సందర్భంగా ప్రారంభమైన వందేమాతరం నినాదం 1947 సం॥రం వరకూ స్వాతంత్ర్య వీరులకు ఉత్తేజం కల్గిస్తూ వచ్చినది.

❀ ❀ ❀

# బంకిం

బంకించంద్ర ఛటర్జీ 1838 సంవత్సరం జూన్ 27 వ తేదీన జన్మించాడు.

బెంగాల్‌లోని ఇరవైనాలుగు పరగణాల జిల్లాలో "కథాలపర" గ్రామం ఇతని జన్మస్థలం.

తండ్రి యాదవచంద్ర ఛటర్జీ. మిద్నపూర్‌లో ఆయన డిప్యూటీ మెజిస్ట్రేటుగా పనిచేసేవాడు.

బాబు రామప్రాణ సర్కారు బంకింకు "ఓనమాలు" దిద్దిపెట్టిన గురువు.

పలకమీద రాసిపెట్టిన అక్షరాలు బంకిం చూచిన వెంటనే స్వంతంగా రాసేవారు.

మిద్నపూర్‌లో మాధ్యమిక పాఠశాలలోకూడా బంకిం మంచి తెలివితేటలుగల విద్యార్థిగా పేరు గడించాడు. తరువాత హుగ్లీ కళాశాలలో చేరిన బంకిం తీరిక వేళలలో గ్రంథాలయంలో కూర్చొని చాలా పుస్తకాలు చదివాడు.



1858 లో కలకత్తా విశ్వవిద్యాలయం నుండి బి.ఏ. పట్టా తీసుకొన్నాడు. తండ్రి మాదిరిగా బంకిం కూడా డిప్యూటీ మెజిస్ట్రేటుగా ప్రభుత్వ ఉద్యోగి అయినాడు.

అప్పుడు ఆయన 25 ఏండ్ల యువకుడు. బంకిం న్యాయంగా, ధర్మంగా తన ఉద్యోగం చేసుకొని పోయేవాడు.

కూలీలను కష్టపెట్టిన నీలిమందు యజమానులను బంకిం తీవ్రంగా దండించాడు.

ఆ దినాల్లో మెకాలే అనే తెల్లదొర బెంగాల్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి. బంకిం అతనివద్ద పనిచేసేవాడు. సాయంత్రం 5 గంటలకల్లా బంకిం ఇంటి ముఖం పట్టేవాడు.

మెకాలేకు ఇది నచ్చలేదు. బంకింను అతడు ప్రశ్నించాడు. బంకిం ఘాటుగా జవాబిచ్చాడు.

"మీరేమో పాలకవర్గం. పైపై ఉద్యోగాలకు వెళతారు. మాకు యింతకంటే పెద్ద ఉద్యోగాలు యెట్లాగూ యివ్వరు కదా! మేము ఎందుకు ఎక్కువగా పనిచేయాలి?" బంకిం మాటలలో నిజం గ్రహించాడు మెకాలే. అతనిని ఏమీ చేయలేక అలీపూర్‌కు బదిలీ చేశారు.

అక్కడ తన పై అధికారి 'బంకిం' 'బంకిం' అని పేరు పెట్టి పిలువసాగాడు. బంకిం అతనికి బుద్ధి చెప్పాడు. బంకిం మొదట్లో కవిత్వం రాశాడు. తరువాత వచనం రాశాడు. "దుర్గేశనందిని" అనే నవల 1864 లో ఆయన రాశాడు. అదే వంగ భాషలో మొదటి నవల.

బంకిం మొత్తం పదహారు నవలలు రాశాడు. బంకిం 1879 లో ఉద్యోగం నుండి విశ్రాంతి తీసుకున్నారు. 1893 లో ఆయన కన్ను మూశారు.



# ఉర్దూ గేయం

వందేమాతరం గేయంలో సంస్కృత పదాలు ఎక్కువగా ఉండి ఉన్నాయి. ముస్లిం సోదరులకు అవి ఎక్కువగా అర్థమయ్యేవి కావు. ఇది గమనించి 'ఇగ్బాల్' మహాకవి రచించిన గీతం 1922 నుండి కాంగ్రెస్ మహాసభలో వందేమాతరంతోపాటు పాడుతూ ఉండేవారు. దానిలో కొంత భాగం యిది.

సారే జాహాఁసే అచ్ఛా
హిందూస్తాన్ హమారా
హమ్ బుల్ బుల్‌హైఁ ఇస్‌కీ
యహాఁ గులిస్తాన్ హమారా

మజహబ్ నహిఁ సిఖాతా
ఆపస్‌మేఁ బైర్ రఖ్‌నా
హిందీహై హమ్ వతన్ హై
హిందూస్తాన్ హమారా

దీనినే చింతా దీక్షితులుగారు యిలా తెలుగులో రాశారు.

"ప్రపంచ మందలి ప్రశస్త దేశం
భారతదేశం మనదేనోయ్
బుల్ బుల్ పిట్టలమోయ్ మనమంతా
మనదేనోయ్ గులాబి తోట
పరస్పరమ్మును వైరము పూనుట
మత మెన్నటికీ ప్రతిపాదించదు."

❀ ❀ ❀

# జనగణమన

మన రాజ్యాంగం 1950 జనవరి 26వ తేదీన అమలులోకి వచ్చింది. అప్పుడు అధికార జాతీయగీతం నిర్ణయించాల్సి వచ్చినది.

పెద్ద పెద్ద ఉత్సవాలు జరిగినప్పుడు జాతీయగీతం మిలిటరీ బ్యాండుతో వాయిస్తూ ఉంటారు. ఇతర దేశాలకు మన నాయకులు వెళ్ళినప్పుడు కూడా యిది బ్యాండుమీద మీటుతారు.

1947 వ సం॥రంలో ఒక సంఘటన జరిగింది. మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మొదటిసారిగా ఐక్యరాజ్య సమితి సమావేశంలో పాల్గొన్నది.

మీ "జాతీయ గీతం" ఏమిటి అని మనవారిని అక్కడివారు అడిగారు. మనవారి దగ్గర జనగణమన రికార్డు ఉండింది. దానిని వెంటనే వినిపించారు.

వాయిద్యాల మీద జనగణమన అక్కడివారికెంతో నచ్చినది.

1912లో రవీంద్రనాధ ఠాగూర్ "తత్త్వబోధిని" పత్రిక జనవరి సంచికలో "జనగణమన" గీతం మొదటిసారిగా ప్రకటించారు.

ఠాగూరు మహాకవి రెండు వేలకుపైగా గీతాలు రచించాడు. ఆయన 'గీతాంజలి' కవితలకు ప్రపంచంలో ఉత్తమమైన నోబుల్ బహుమతి వచ్చింది.

ఆయన దృష్టిలో మానవుడే దేవుడు. కాయకష్టం చేసే కార్మికునిలోనే ఆయన భగవంతుణ్ణి దర్శిస్తాడు.

రాజ్యాంగ సభలో నెహ్రూ పండితుడు యిలా అన్నాడు. "వందేమాతరం మన స్వాతంత్ర్య పోరాటంతో సన్నిహిత సంబంధం కలిగి ఉంది. అది నిర్వివాదంగా మన ప్రధాన జాతీయ గీతం. ఆ స్థానం నుండి ఏ యితర గీతం దానిని తొలగించలేదు. జాతీయ గీతపు ప్రాముఖ్యం స్వదేశాలకంటే విదేశాలలోనే ఎక్కువ. ఒక జనగణమన ఫణితి విదేశాలలో గొప్ప మెప్పు పొందింది."

రాజెన్‌బాబు యిలా అన్నాడు. “పదాలూ, సంగీతం కలిసిన ‘జనగణమన’ గీతం భారతదేశ జాతీయ గీతం. స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రధాన పాత్ర వహించిన వందేమాతరం గేయం జనగణమన గీతంతో సమానంగా గౌరవించబడి సమాన గౌరవ ప్రతిపత్తి కలిగి ఉంటుంది.



# జాతీయ గీతం కొన్ని సూచనలు

రవీంద్రనాథ ఠాగూరు రచించిన జనగణమనలో మొత్తం 31 చరణాలు ఉన్నాయి. అందులో ఈ కింది ఏడు చరణాలు మాత్రమే మన జాతీయ గీతంగా ఎన్నుకొన్నారు.

జనగణమన అధినాయక జయహే
భారత భాగ్యవిధాతా!
పంజాబ, సింధు గుజరాతు మరాఠా
ద్రావిడ, ఉత్కల, వంగా
వింధ్య, హిమాచల, యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగా
తవ శుభ నామే జాగే
తవ శుభ ఆశిష మాగే
గాహే తవ జయ గాథా
జనగణ మంగళ దాయక జయహే!
భారత భాగ్య విధాతా
జయహే! జయహే! జయహే!
జయ జయ జయ జయహే!

1919 లో ఠాగూరు మదనపల్లి వచ్చాడు. అక్కడి థియోసాఫికల్ కళాశాల హాస్టలులో ఆయన విడిది చేశాడు.

ఆ కళాశాల ప్రిన్సిపాల్ భార్య శ్రీమతి మార్గరేట్ కజిన్సు. ఆమెకు సంగీతం బాగా వచ్చు.

"జనగణ" గీతానికి ఒక "బాణీ" కూర్చి ఠాగూరుకు వినిపించింది.

ఠాగూరుకు ఆ "బాణీ" నచ్చింది. మార్గరేట్‌ను మెచ్చుకున్నారు.

ఇప్పుడు మనం పాడే ఫణితి (బాణీ) మార్గరేట్ కూర్చిందే.

ఈ పాటలోని భావం తెలిసికొనుట అవసరం.

జనావళి మనసులను నడిపించే ఓ భారత భాగ్యవిధాతా
నీకు జయం కలుగుగాక.
పంజాబు, సింధు గుజరాతు
మహారాష్ట్ర ద్రావిడ ఉత్కల వంగ అనే ప్రదేశాలూ,
వింధ్య హిమాచల పర్వతాలు, గంగా యమున నదులు
ఉప్పొంగి పోతున్న సముద్ర కెరటాలూ
నీ శుభ నామాన్ని తలుచుకుంటూ
మేలుకొంటున్నాయి.
నీ శుభ ఆశీస్సులను కోరుతున్నాయి.
నీ జయ గీతాలను పాడుతున్నాయి.
జనావళికి మేలుకూర్చే
ఓ భారత భాగ్యవిధాతా
నీకు జయము కలుగు గాక.

ఈ గీతం పూర్తిగా రికార్డుపైన వినిపించడానికి 52 సెకండ్లు మాత్రమే పడుతుంది.

ఈ గీతాన్ని క్లుప్తంగా పాడే సందర్భాలు కూడా కొన్ని ఉన్నాయి.

జనగణమన అధినాయక జయహే!
భారత భాగ్యవిధాతా!
జయహే! జయహే! జయహే!

అని పాడాలి.

ఇలా రికార్డుపై వినిపించడానికి ఇరవై సెకండ్లు చాలు.

సాధారణంగా అతిథులకు విందుచేసే సమయాలలో ఈ గీతాన్ని క్లుప్తంగా పాడతారు.

పాఠశాలలో దినసరి కార్యక్రమం జాతీయ గీతాన్ని ఆలాపించడంతో ప్రారంభమౌతుంది.

విద్యార్థులకు జాతీయ గీతం కంఠతా రావాలి. జాతీయ పతాకం పట్ల గౌరవ భావం కలిగి ఉండాలి.

జాతీయ గీతం పాడేటప్పుడుగానీ, రికార్డు వేసేటప్పుడుగానీ ప్రేక్షకులు సావధానంగా వుండాలి.

జాతీయ గీతంపట్ల నెహ్రూగారికి భక్తిశ్రద్ధలు ఉండేవి. అందరికీ అలాంటి భావన కలగాలి.

ఎన్నో సభలలో నెహ్రూ స్వయంగా దీనిని పాడేవారు. ప్రజలచేత పాడించి ఆనందించేవారు.

దీనిని అందరూ కలిసి (కోరస్‌గా) పాడాలి.

అధికారికంగా నిర్ణయించిన స్వరంలోనే పాడడం ముఖ్యం.

నాందేడ్‌లో ఒక విద్యార్థి పాఠశాలలోపల ప్రవేశించే ముందుగా అతనికి జాతీయ గీతం వినిపించింది. అతడు అక్కడే నిలిచిపోయాడు. జోరున వర్షం కురుస్తున్నా అతడు చలించలేదు. ఈ విద్యార్థి భక్తిశ్రద్ధలను జిల్లా కలెక్టరు మెచ్చుకొని యాభై ఒక్క రూపాయలు బహుమతిగా యిచ్చాడు.

జాతీయ పతాకంపట్ల గౌరవం చూపినట్టే జాతీయగీతం పట్ల కూడా శ్రద్ధ కనపరచడం మన విధి.

**జై హింద్**